శ్రీరస్తు

కేసరగిరి

# శ్రీరామలింగేశ్వర నక్షత్రమాల







రచయిత

"రసప్రియ"

శ్రీరంగాపురం కేశవాచార్య, బి.ఏ.

డా॥ దివాకర్ల వేంకటావధాని,
ఎం. ఎ. పిహెచ్. డి.
ఉస్మానియా విశ్వవిద్యాలయం
ఆంధ్రశాఖాధ్యక్షులు, (ఆ.ప్ర.)

# అభినందనాశీర్వాదము.

శ్రీ శ్రీరంగాపురం కేశవాచార్యులుగారు రచించిన శ్రీరామ లింగేశ్వర నక్షత్రమాల యందలి పద్యములను వారు చదివి వినిపింపగా విని యానందించితిని. ఇందలి పద్యములన్నియు భక్తి బంధురములును, రసపరిపూర్ణములును, ధారా శుద్ధి శోభితములును, భావ గంభీరములును, నిర్దుష్టములునై కవిగారి నిర్మలభక్తిభావమును. కవితా కౌశలమును చాటుచున్నవి. ఇవి భక్తులెల్లరును బఠించి యానందింపుటకుఁదగియున్నవి. శ్రీకవిగారింకను ఇట్టి భక్తిభావ రమ్యములగు కృతులు రచించి యాంధ్ర సరస్వతికభినవాలంకారములు కూర్తురుగాక.

దివాకర్ల వేంకటావధాని,
9-3-67.

త్ర్యర్థికావ్య నిర్మాత
కవిసింహాద్యనేక బిరుదాంకిత
**పోకూరి కాశీపత్యవధాని.**
బోదెలవీడు, గుంటూరు జిల్లా.

చారు పదాంచితంబు నయి
శ్రావ్యము నై రస వత్తరంబునై
సూరి మనోహరంబు నయి
శుంభ దలంకరణాన్వి తంబునై
భూరి సలక్షణంబు నయి
పొల్చెడు కైత తగఁబట్టి కేశవా
చారికి చెల్లునంచును " రస
ప్రియ " యన్ బిరుదంబు నిచ్చితిన్.

# కేసరగిరి క్షేత్ర చరిత్ర

## క్షేత్రస్థల వివరణ

ఆంధ్రప్రదేశమున హైదరాబాదు జిల్లా మేడిచల్ తాలూకాలో కేసరగిరి శ్రీ రామలింగేశ్వర పుణ్యక్షేత్రము వెలసియున్నది. హైదరాబాదు నగరానికి ఈశాన్య దిశకు సుమారు 20 మైళ్ళ దూరమందును. ఘటకేశ్వరము రైల్వేస్టేషనుకు 6 మైళ్ళదూరము మాత్రమే. ప్రతి సంవత్సరము మహాశివరాత్రి పర్వదినములలో శ్రీస్వామివారి బ్రహ్మోత్సవములు (కీసర జాతర అను పేరుతో) వారము రోజులు అత్యంత వైభవముగా జరుగును. వివిధ ప్రాంతముల నుండి వేలాది జనులు విచ్చేసి భక్తితత్పరులై స్వామిని సందర్శించి, పూజించి తరించుచుందురు. యాత్రికుల సౌకర్యార్థము గిరి శిఖరముపై నున్న ఆలయమువరకు రోడ్డు వేయబడియు, యాత్రిక శాలలు, అతిథి భవనములు, మంచినీటి సరఫరా, విద్యుద్దీపములు మొదలగు సదుపాయములు నెలకొల్పబడినవి. కేసరగిరికి "కీసరగుట్ట" అను వ్యవహారనామాంతరము కూడ కలదు.

## క్షేత్ర చారిత్రకాంశములు

ఈ పుణ్యక్షేత్ర మతి ప్రాచీనమైనది. త్రేతాయుగమున శ్రీరామచంద్రు డిచ్చట శివలింగమును ప్రతిష్ఠించెనని అందుచేత నిచటి లింగేశ్వరునకు రామలింగేశ్వరుడను పేరు వచ్చెనని ప్రతీతి కలదు. అవతార పురుషుడైన శ్రీరామచంద్రమూర్తినే ఆకర్షించిన

త్ర్యర్థికావ్య నిర్మాత
కవిసింహాద్యనేక బిరుదాంకిత
**పోకూరి కాశీపత్యవధాని.**
బోదలవీడు, గుంటూరు జిల్లా.

చారు పదాంచితంబు నయి
　　శ్రావ్యము నై రస వత్తరంబునై
సూరి మనోహరంబు నయి
　　శుంభ దలంకరణాన్వి తంబునై
భూరి సలక్షణంబు నయి
　　పొల్పెడు కైతగలట్టి కేశవా
చారికి చెల్లునంచును " రస
　　ప్రియ " యన్ బిరుదంబు నిచ్చితిన్.

# కేసరగిరి క్షేత్ర చరిత్ర

## క్షేత్రస్థల వివరణ

ఆంధ్రప్రదేశమున హైద్రాబాదు జిల్లా మేడిచల్ తాలూకాలో కేసరగిరి శ్రీ రామలింగేశ్వర పుణ్యక్షేత్రము వెలసియున్నది. హైద్రాబాదు నగరానికి ఈశాన్య దిశకు సుమారు 20 మైళ్ళ దూరమందును. ఘటకేశ్వరము రైల్వేస్టేషనుకు 6 మైళ్ళదూరము మాత్రమే. ప్రతి సంవత్సరము మహాశివరాత్రి పర్వదినములలో శ్రీస్వామివారి బ్రహ్మోత్సవములు (కీసర జాతర అను పేరుతో) వారము రోజులు అత్యంత వైభవముగా జరుగును. వివిధ ప్రాంతముల నుండి వేలాది జనులు విచ్చేసి భక్తితత్పరులై స్వామిని సందర్శించి, పూజించి తరించుచుందురు. యాత్రికుల సౌకర్యార్థము గిరి శిఖరముపై నున్న ఆలయమువరకు రోడ్డు వేయబడియు, యాత్రిక శాలలు, అతిథి భవనములు, మంచినీటి సరఫరా, విద్యుద్దీపములు మొదలగు సదుపాయములు నెలకొల్పబడినవి. కేసరగిరికి "కీసరగుట్ట" అను వ్యవహారనామాంతరము కూడ కలదు.

## క్షేత్ర చారిత్రకాంశములు

ఈ పుణ్యక్షేత్ర మతి ప్రాచీనమైనది. త్రేతాయుగమున శ్రీరామచంద్రు డిచ్చట శివలింగమును ప్రతిష్ఠించెనని అందుచేత నిచటి లింగేశ్వరునకు రామలింగేశ్వరుడను పేరు వచ్చెనని ప్రతీతి కలదు. అవతార పురుషుడైన శ్రీరామచంద్రమూర్తినే ఆకర్షించిన

యీ శైలరాజ మానాడు మహా ఋష్యాశ్రమమైయుండె నేమో! ఏదెట్లున్నను ఈ మహాక్షేత్ర మనంత మహిమాన్వితమైనది. ఈప్రదేశ మత్యంత ప్రశాంత వాతావరణము కలది. ఈ స్థల మహిమే మో కాని ఇచటి కేగుదెంచు భక్తులకు చిత్త ప్రశాంతి కలుగుచుండును. ఇంక భక్తవత్సలుడై భక్తజనుల యభీష్టముల దీర్చుచున్న శ్రీ రామ లింగేశ్వరుని మహిమ అనుభవైక వేద్యమేకాని చెప్పనలవి కాదు.

ఈ పర్వతముపై నెన్నో పెద్ద పెద్ద నల్లని లింగములు చిందర వందరగా పడియున్నవి. ఈ మహోన్నత శిలాలింగము లెచ్చటి నుండి యిటకెట్లు వచ్చెనో కాని ఈజాతి శిలలు ఇచటి చుట్టు ప్రాంతములం దెచ్చటను కానరావందురు ఇందుకు కొందరిట్లందురు శ్రీ రామచంద్రమూర్తి యిచట శివలింగమును ప్రతిష్ఠింపదలచి దివ్య లింగమును తీసికొని తమ్మని హనుమంతుని పంపగా ముహూర్తమున కాంజనేయుడు రానందున రాముడే యిసుకతో నొక లింగమును సిద్ధపరచు కొనెనని కొందరు ; కాదు పరమ శివుడే ప్రత్యక్షమై ఒక దివ్య లింగమును రామునకుప్రసాదించెనని అందుచేత ఇచటి లింగము "స్వయంభూలింగ" మని మరికొంద రందురు. హనుమంతుడు నూట ఒక్క లింగములను తీసికొనిముహూర్తానంతరమురాగా ప్రతిష్ఠ ముగి యుటచే తానొనర్చిన కృషి విఫలమైనందుకు కినుకజెంది తాతెచ్చిన లింగముల విసరిపారవేసెనని యవియే యిచటకనుపించు లింగములని చెప్పుకొనుచున్నారు శ్రీరాముడు హనుమంతుని అలుక దీర్చుటకై "ఈ శైలరాజము నీపేర వ్యవహరింపబడును. నేనుప్రతిష్ఠించిన లింగ ముతో పాటు నీమూర్తికిని పూజలుజరుగు"నని వరమిచ్చెనట. కేసరి అనగా హనుమంతునకు పేరున్నది." కేసరి " " కేసర "గా మారె నేమో ! కాని "కేసర" అనియే వాడుకలో నున్నది. ఇచట అంజ

నేయస్వామి విగ్రహామునకును పూజలు జరుగును. అంజనేయ విగ్రహము లివట చాల కలవు.

"కేసర" అను సంస్కృత పదానికి చాలా అర్థాలున్నవి. "కిఞ్జల్కః కేసరః = ఆకరు పువ్వుల పేళ్ళు పున్నాగే పురుషస్తుఙ్గః కేసరో దేవవల్లభః = సురపొన్న పేళ్ళు కేసరః వకుళః = పొగడ పేళ్ళు" అని అమరం. "పొన్నపూలతోటి పూజసేతు" అన్న తెనుగు పద్యాన్ని బట్టి పొన్నపూలను అర్థంతో కేసరములు పూజార్థములు. ఈ పర్వతముపై ఒక తామర కొలను కలదు. దీనిని "తామరగుంట" అని పిలుతురు. ఈ పర్వతరాజ మొకప్పుడు కేసరాది పుష్పలతా తతి సంయుతమై తపస్సు కనుకూలించు ప్రకృతి రామణీయకతతో ప్రశాంత వాతావరణముతో నలరారు చుండెనేమో ! మన పుణ్యక్షేత్రము లొకానొకప్పుడు మహాఋషులు తమ యిష్టదేవతను ప్రతిష్ఠించి యారాధించిన తపోనిలయములుగా ఆశ్రమములుగా నుండెననుటకు మన పురాణములు తార్కాణములుగా నున్నవి. స్థల పురాణముల పరిశోధించినచో ప్రతి పుణ్యక్షేత్రమున నొక మహిమగల చరిత్ర తప్పక లభించును స్థల చరిత్రము వెలుగులోనికి రాని కారణాన మనదేశమందనేక పుణ్యక్షేత్రములు మరుగున బడియున్నవి. "కేసరిగిరి క్షేత్ర మహాత్మ్యము" ఇంతవరకు వెలువడలేదు.

మన పుణ్యక్షేత్రములు మత సంస్కృతులకు ఆలయములు. కేసరగిరి క్షేత్రమున, కాలప్రవాహామునకు తట్టుకొని పురాతన విస్మృత రాజకీయ, మత, సాంస్కృతిక, చారిత్రక, విశిష్టతనుచాటు శిథిలములు, శిలాఖండికలు, శాసనములు కనుపట్టుచున్నవి. చారిత్రక దృష్టితో పరికించి రచించిన ఒక గ్రంథమే యగును. ఈ గిరి శిఖరాగ్రముపై మత్స్యకూర్మ, వరాహావిఘ్నేశ్వరాంజనేయాదిచిత్రము

లతో సుదీర్ఘమై స్థూలమై నేటికిని వెలసియున్న ఒక పురాతన శిలా జయస్తంభము నెవరు స్థాపించిరో! ఇందేయే రాజకీయ మతసంస్కృతులు దాగియున్నవో నేటికిని తెలియ రాకున్నది. పర్వత పంక్తికి క్రిందిభాగమున కోట ప్రాకారముగా నున్నట్లు గోడల పునాదుల గుర్తులు, పర్వతముపై భవన నిర్మాణమున్నట్లు అచటచట లభించు పురాతన ఇటుకలు, శిలాశాసనములు, " గోన బుద్ధారెడ్డి బండ లేక గోనరాజుల కోట " అని ప్రజలచే నేటికి తమకు తెలియకుండానే వ్యవహరింపబడు శైలప్రాంతము తరితర శిథిలములు చూచినప్పుడు వీటిమాటునయే విస్మృత సాంస్కృతిక సామ్రాజ్య ప్రాశస్త్యము గర్భితమైయున్నదో తెలిసికొన జిజ్ఞాస కలుగును. ఇచట ప్రధాన దేవాలయమైన శ్రీరామలింగేశ్వరాలయము పశ్చిమాభిముఖమై యుండుట ఒక ప్రత్యేకత.

ప్రధాన దేవాలయమునకు కొన్నిఅడుగుల దూరమున అత్యున్నత శిల్పకళా ప్రదర్శనముతో మరొక దేవాలయము కలదు. ఇందు శాంతిస్వరూపముతో శ్రీ లక్ష్మీనరసింహస్వామి విగ్రహమును లింగములేని లింగపీఠమును కలవు ఈ ఆలయమున యేదో అంగుళీయముద్రవలె చిత్రింపబడిన శిల్పఖండిక కలదు. ఇది కాకతీయ రాజముద్రికను పోలినదని. ఈ ఆలయమందలి శిల్పము కాకతీయ శిల్పకళను పోలినదని కొందరందురు ఒకచో గుండునకు భైరవుని విగ్రహము, మరొకచో దుర్గ విగ్రహము (సీతమ్మ స్థాపించిన దుర్గ అని వాడుక), వేరొకచో బుద్ధుని శిలా విగ్రహము తదితర దేవతా విగ్రహములు కలవు. ఈ దివ్య క్షేత్రము శైవ వైష్ణవ బౌద్ధమతాదుల కాశ్రయమిచ్చి సర్వమత సామరస్యతను నెలకొల్పె నన్నట్లున్నది.

ఏదెట్లున్నను ఈ పుణ్యక్షేత్ర పవిత్ర చరిత్ర సమగ్రముగా గ్రంథరూపములో వెలువడవలసిన యవసర మెంతైనా కలదు. ఈ క్షేత్ర చరిత్రను గురించి సారస్వత యాధారములు లేనికారణాన కేవలము జనశ్రుతి యాధారముగా నేనెఱింగినంతవరకు క్షేత్రమును గురించి కొంతసమాచార మిందు నుదహరించితిని ఈ క్షేత్ర సమాచారమింతే యని భావింపరాదు. సాగర గర్భములోని రత్నములవలె ఈమహాక్షేత్ర పూర్వవైభవమును గురించిన అద్భుతవిశేషములు అసంఖ్యాకములు. ఈ క్షేత్ర చరిత్రాంశము లందించుటలో " ఉడుత రాల్చిన యిసుక తీరుగ " నా ప్రయత్నము చాల చిన్నది

## కృతజ్ఞత

పూజ్య శ్రీ డా॥ దివాకర్ల వేంకటావధానులుగారు నేనిందలి పద్యములను చదివి వినిపింపగా విని యానందించి నన్నాశీర్వదించి ప్రోత్సహించి యీ గ్రంథమునకు తొలిపలుకు వ్రాసియిచ్చిరి. వారికి నా కృతజ్ఞతాభి వందనము లర్పించుచు నా కావ్య గ్రంథములలో తొలిముద్రణాలంకరణ ధరించు నా యీ పొత్తమునకు వారి తొలిపలుకు శుభాశీర్వాదముగా గ్రహించుచున్నాను.

ఈ గ్రంథముద్రణకు తోడ్పడిన సహృదయులకు, ఈ పుణ్యక్షేత్రమును గూర్చి మహాజనులకు విన్నవించు కొనుటకు సమాచార సేకరణలో డ్పడిన మిత్రులకు నా ధన్యవాదములు.

# సమర్పణ

భక్తిరస ప్రధానముగా నేనీ " నక్షత్రమాల " యను గ్రంథమును నా నేర్పుకొలది రచించి ఉదుతభక్తితో శ్రీ రామలింగేశ్వర స్వామి దివ్యచరణ సాన్నిధ్యమునకు సమర్పించు కొనుచున్నాను.

ఈ కృతి సహృదయుల నానంద పఱచిన కృతార్థుడ నైనట్లు భావింతును.

రచయిత.



శ్రీరస్తు

శ్రీ రామలింగేశ్వర పరబ్రహ్మణేనమః

# శ్రీ రామలింగేశ్వర నక్షత్రమాల

శ్రీ కారుణ్య పయోధివంచు నినునే
చిత్తంబునం దెప్పుడ
స్తోకాసక్తిని భుక్తిముక్తులకునై
స్తోత్రంబుగా వింపుచున్
నీకీప్రొత్తము గాన్కగానిడుదు పూ
న్కిన్ గామితార్థంబులన్
జేకూర్పంగదె కేసరాద్రి నిలయా!
శ్రీ రామ లింగేశ్వరా!

ఓ గంగాధర । ఓ సుధాకర ధరా ।
ఓ సర్వ లోకేశ్వరా ।
ఓ గంభీర దయాకరా । శుభకరా ।
ఓ భక్త మందార । నా
వాగాడంబరమున్ క్షమించి కృపనన్
పాలింప రావే । కప
ర్థీ । గౌరీప్రియ । కేసరాద్రినిలయా ।
శ్రీ రామ లింగేశ్వరా ॥ 2

జయ భాగ్యోదయ । శుభ్రగోవర హయా ।
సద్భక్త చిత్తాలయా ।
నయసమ్యక్క్రియ । శత్రులోక విలయా ।
నానార్త రక్షాభయా ।
భయ శోకవ్యయ । నిష్కళంక హృదయా ।
భవ్యాశయా । పార్వతీ
ప్రియ । నన్మోక్షమయ । కేసరాద్రి నిలయా ।
శ్రీ రామ లింగేశ్వరా ॥ 3

గంగా నిర్ఝరణీ ధరా। శుభకరా।
కారుణ్య రత్నాకరా।
శృంగారేందు ధరా। జగత్ప్రభువరా।
చిత్రాంబరా। నీకు సా
ష్టాంగం బొప్ప నమస్కరించి మది ని
న్నశ్రాంత ముఁగా గొల్తు న
ర్థిం గాపాడుము కేసరాద్రి నిలయా। 4
శ్రీ రామ లింగేశ్వరా॥

నిను వర్ణింపగ నాల్గు నోళ్లుగల వా
ణీ భర్తకైనన్ దరం
బిసు మాత్రంబును గాదదట్లగుట నే
కాస్యుండ నాకెట్లు వ
ర్ణన సేయంగ వశంబగున్ గరుణతో
నాస్తోత్ర మాలించి కూ
ర్మిని నన్నేలుము కేసరాద్రి నిలయా।
శ్రీరామ లింగేశ్వరా। 5

రవి చంద్రానలలోచనా ! వినుము, తా
రా పుంజముల్ వర్ష బిం
దు వులన్ లెక్కఁడ రాని భంగి విలస
త్పుణ్య ప్రదంబున్ బుధ
స్తవ నీయంబగు నీ గుణంబులను సా
ధ్యంబౌనె లెక్కింపగన్
శివ। గౌరీధవ। కేసరాద్రి నిలయా।
శ్రీ రామ లింగేశ్వరా। 6

పదముల్ సాలవు నిన్ను నే బొగడ
భావంబంతకున్ జాలదిం
పొదవన్నీ మహిమోన్నతుల్దెలుప శం
భూ। యెట్లు వర్ణింతునిన్
జదువుల్ నేర్వగ లేదుగాని నినునే
సంస్తోత్ర మెవ్వేళ జే
సెద నన్నేలుము కేసరాద్రి నిలయా।
శ్రీ రామ లింగేశ్వరా॥ 7

మును త్రేతాయుగ మందు రాఘవుడు నిన్
బూనిక్కన్ బ్రతిష్ఠించి కొ
ల్చె నటంచున్ బుధులందుఱగాన నిఁకనే
సేవింపగా బూనుటల్
ఘనమే। మామక కామితార్థ ములవే
డ్కన్ దీర్పవే। నిన్ను మిం
చిన వేల్పెవ్వడు? కేసరాద్రి నిలయా।
శ్రీ రామ లింగేశ్వరా। 8

అరి సంహార మొనర్ప జాలునొక ది
వ్యాస్త్రంబు నీయంగ శ్రీ
హరిచేగాక కదా కిరీటి నిను సం
ప్రార్థించి మున్ శత్రుభీ
కరమౌ పాశుపతాస్త్రమున్ బడసె నీ
కన్నన్ మహానీయుడీ
స్థిరనెవ్వండయ। కేసరాద్రి నిలయా।
శ్రీ రామ లింగేశ్వరా। 9

ఒక పార్శ్వమ్మున నాడు రూపమయి చె
ల్వొప్పన్ విలోకింప వే
రొక వంకన్ బురుషాకృతిన్ వెలసితోహో।
సర్వ లోకాలకీ
వొకడే తల్లివి దండ్రివై తనరనేమో।
అర్ధనారీత్వమో
ర్చి కృపన్ దాల్చితి కేసరాద్రి నిలయా।
శ్రీ రామ లింగేశ్వరా। 10

కొలువై నీవెసఁగన్ సతీసుతులతో
గూర్చుండి యున్నప్పుడిం
పలరన్ గోవర సింహ మూషక శిఖివ్యా
ళంబులుగా మీకడన్
జెలిమిన్ వర్తిలజేసి నట్లుజనులన్
స్నేహంబునన్ ధాత్రి వ
ర్తిల జేయఁగదె। కేసరాద్రి నిలయా।
శ్రీరామ లింగేశ్వరా। 11

ఏమో యింతవిషంబు మ్రింగుట ఘనం
బెట్లౌనహో । యిప్పుడీ
కామ క్రోధమదాగ్ని హాదిదురహం
కార ప్రపంచైక సం
గ్రామాణ్వస్త్ర భుజంగ దుర్విషము మ్రిం
గన్ జాలుచో నెంతునీ
స్థేమ స్తోమత కేసరాద్రి నిలయా!
శ్రీ రామ లింగేశరా ! 12

జలధిన్ జేరవె సర్వవాహినులు తత్
సామ్యంబుగా పల్కమతం
బులు నీ సన్నిధిజేరు మార్గమునె చూ
పున్గాన యోజింప భూ
తలమందే మతమైన నేమి? చెలు వొం
దన్నిన్ బ్రశంసింపభా
సిలడే భక్తుడు? కేసరాద్రి నిలయా!
శ్రీ రామ లింగేశ్వరా! 13

జననమ్మొందక ముందె బిడ్డ కొఱకై
స్తన్యంబులన్ దల్లికిన్
దనరన్ గూర్చిన ప్రేమ మూర్తివిగదా
తదీప్తి నెల్లప్పుడున్
నను పాలింపనుపేక్షయేల నఖిలజ్ఞా !
సర్వలోకేశ ! ప్రే
ర్మని నన్నేలుము కేసరాద్రి నిలయా !
శ్రీ రామ లింగేశ్వరా ! 14

స్వామీ ! నీవెటు మంచుకొండపయి వా
సంబుంటివో యెంతగా
నీమేనెట్లు చలిన్ భరించెనొ గదా !
నీకోసమై వెచ్చగా
ధామం బేర్పడనిత్తు నా యెడదలో
తండ్రీ ! వసింపంగదే !
ప్రేమాంభోనిధి ! కేసరాద్రి నిలయా !
శ్రీ రామ లింగేశ్వరా ! 15

పరమార్థంబని శంబుగోరు కొనుమత్
స్వాంతాగ్ర కాసారమం
దరయన్ భక్తియనందనర్చు కమలం
బావిర్భవించెన్ దదం
బురుహంబున్ గొనియెల్ల వేళలనినున్
పూజింతు జేకూర్పు సు
స్థిరలక్ష్యంబును కేసరాద్రినిలయా।
శ్రీరామ లింగేశ్వరా। 16

స్వామీ। నీ పయి నిండుభక్తి నరిష
డ్వర్గాదులన్ నిచ్చలున్
సామర్థ్యంబున గెల్చు శక్తి భవబం
ధక్లేశముల్ దుంచి ని
త్యామోదంబును జెందు యుక్తి పరమా
త్మా! నాకు జేకూర్పవే!
ప్రేమాంభోనిధి। కేసరాద్రినిలయా।
శ్రీ రామ లింగేశ్వరా॥ 17

పాలన్ బెంచిన గర్వబూనుకొను స
ర్పాలన్ ధరించన్ బ్రియం
బేలాగయ్యె విషంబు మ్రింగ గమనం
బెట్లొప్పె నారీతిగా
నాలో గల్గిన పాప హాల హల మూ
నన్ బ్రీతి చిత్తానయే
లీలన్ లేదొకొ । కేసరాద్రి నిలయా ।
శ్రీ రామ లింగేశ్వరా ॥ 18

గదిలో జీకటి క్రమ్మ కొన్నటుల న
జ్ఞానాంధ కారంబు నా
ఎదలో నంతట నిండియుండె నిక తం
డ్రీ । అంధకారంబు బా
పెదవంచున్నెర నమ్మియుంటిని కదా !
విజ్ఞాన దీపంబు నా
హృది వెల్గించుము కేసరాద్రి నిలయా ।
శ్రీ రామ లింగేశ్వరా ॥ 19

పులితోల్గట్టి కరంబునందు మహితం
బున్ బట్టి కంఠాన పా
ముల నింపారగ జుట్టి మేన భసితం
బున్ బూసి కొన్నట్టి నిన్
దిలకింపన్ దలపెట్టి నిత్యము ప్రీ
తిన్ గొల్తు గాబట్టి భా
పిల జూపట్టుము కేసరాద్రి నిలయా!
శ్రీ రామ లింగేశ్వరా! 20

స్వామీ! నీవె శరణ్యమంచు మది సం
భావించి దైన్యంబుతో
నామూర్ధంబు భవత్పదాబ్జ ములనా
నన్ మోపి బాష్పాంబుధా
రామాలిన్య మొనర్చు వాడనని బల్
శంకించి కన్పింపవా ?
ప్రేమాంభోనిధి! కేసరాద్రి నిలయా।
శ్రీ రామ లింగేశ్వరా। 21

ఈ విశ్వంబున నిండియున్న ఘనుని
న్నేమాత్ర మెందేని నే
నేవేళన్ గననైతి నజ్ఞుఁడను నిం
కేరీతి నిన్ జూతు దే
వా! విత్తంబు ఘటిల్లనీ యను భవిం
పన్ నేర్చునే లోభి? నా
సేవల్ గైకొను కేసరాద్రి నిలయా!
శ్రీ రామ లింగేశ్వరా॥ 22

కలి కాలంబిది నీవు గన్పడనిచో
గౌరీశు డున్నట్లు లో
కులు నుంతైనను నమ్మజాలరు ప్రభూ!
కోపించ కీమాటకున్
వెలుగే లేనపు డెట్లు నమ్మనగు నుర్విన్
సూర్యుడున్నట్లు? భా
సిల గాన్పింపుము కేసరాద్రి నిలయా!
శ్రీ రామ లింగేశ్వరా! 23

భూమిన్ నేగను పించగాజనులు గం
పుల్ గూడి విచ్చేసి ఏ
మే మో కోర్కెలుగోరు చుందురని తం
డ్రీ ! కాన రావైతివా !
స్వామీ ! కన్పడకున్న వీడనికనే
సత్యాగ్రహం బూనెద న్
ప్రేమాంభోనిధి ! కేసరాద్రి నిలయా !
శ్రీ రామ లింగేశ్వరా ! 24

ఈవా ! ధాత్రిన గోచరుండ వింక నీ
న్నేలీల దర్శింతునో
దేవా ! నేనొక యల్పమానవుడ సం
దేహాత్ముడన్ మూర్ఖుడన్
రావే ! దర్శనమీయవే ! వరములన్
బ్రాప్తింపగా జేయవే !
సేవింతున్ నిను కేసరాద్రి నిలయా !
శ్రీరామ లింగేశ్వరా ! 25

ప్రతి పద్యంబును నీదు నామమకుట
ప్రాప్తిన్ విరాజిల్లు నీ
కృతి నెవ్వారు పఠించినన్ వినిన గూ
ర్మిన్ వారిపై నీదయా
మృత వృష్టిన్ గురియించి ఘోరవుమని వి
న్నెంతేన్నఁ దింతున్ మదీ
ప్సితముల్ దీర్పుము కేసరాద్రి నిలయా ।
శ్రీ రామ లింగేశ్వరా । 26

నామంబెన్నగ కేశవుండన వనిన్
రామాంబికా జానకీ
రామాచార్యుల కగ్రనందనుఁడ శ్రీ
రంగాపురీ ధాముడన్
గైమోడ్తున్ భవదీయ పాదములకున్
గావ్యార్థముల్ గూర్చి స
త్ప్రేమన్ బ్రోవుము కేసరాద్రి నిలయా!
శ్రీ రామ లింగేశ్వరా! 27

మంగళం మంగళం మంగళం